ములను। శస్త్రంబుగా నిడిస్వార్థతమీర నవి స్తరంబుగ గాంచి మస్తకములు।
ప్రస్తరింపుచునను ప్రస్తుతుల్ సేయుచుంచా స్తుశో జెప్పుటనాస్తి భువిని। రస్త
హింద్వాదూర్థ గ్రంథ విస్తారములఁ గనిశాస్త్ర నెమ్మదినొక మోస్తరైన ॥ తే॥ గీ॥
కస్తిఁబొడగువచించితి నిస్తులముగ। హస్తములు మోడ్తుక్షమి యింపునే
స్తముంచి। ప్రస్తుతపు చర్యలనమది గుస్తరించి ॥ కలి ॥ ౯౫ ॥

సీ॥ నిజమాడినను వచ్చునిష్ఠురంబంచును నిజమాడకుండుట నీతిగాదు।
ఉన్నమాటాడిన నుడికినట్లగుననుచున్న మాటాడకనుండ రాదు। స్థిరనుయ
థార్థవాది జగద్విరోధియంచును యథార్థము వల్కకునికి తగదు। మంచి
జెప్పఁగబోవ మలయును చెడ్డని మంచిచెప్పకనుండి మంచిగాదు ॥ తే॥ గీ॥
టంచు నెవరెట్టులనుకున్న మంచిచెడ్డ। లెంచ రాప్రాజ్ఞులంచు నూహించినేవ।
చించితి నిజమ్ము నీవుఁ గోపించకయ్య ॥ కలి ॥ ౯౬ ॥

సీ॥ బ్రాహ్మణుల్వీరను పక్షపాతంబున క్షత్రియుల్వీరను మైత్రినెఱపి।
వైశ్యులు వీరను వైరస్యబుద్ధిచే శూద్రులటన్నయుపాయతోను। హరా
ణులటంచభిమాన ముప్పొంగఁగ సాయిబులంచు నిస్సారముసను। పంచము
లను వ్యాగ్రభావంబుతోఁడను నన్యదేశీయులంచన్యబుద్ధి ॥ తే॥ గీ॥ జెప్పలే
దిప్పటికిఁగలచొప్పులరసి। జెప్పితినటంచుఁ జదవరు లొప్పుకొనక। తప్పదని
యుంటివలదు నీ మెప్పు మాకు ॥ కలి ॥ ౯౭ ॥

సీ॥ దండింపకయ్య నాదుండగంబులు ధరామండలిఁ దెల్పె నీతండటంచు।
కోపించకయ్య నాపాపకర్మంబులుఁ దాపక దెల్పె నీతండటంచు। తిట్టించక
య్య నాగుట్టెల్లభంగులఁ ధట్టించి తెల్పె నీతండటంచు। పోరింపకయ్య నాఘో
రకృత్యంబులు దారతఁ దెల్పె నీతండటంచు ॥ తే॥ గీ॥ నన్ను నేనున్నదున్న
టులన్నదప్పు। గొన్న మత్ప్రభు సన్నిధివిన్నవించి। నిన్నుఁ దండింపుదును
మమామన్ననిడక ॥ కలి ॥ ౯౮ ॥

సీ॥ తమకుఁ బుట్టించు విధాతకైనను ప్రజలందఱు భూషింతురన్నమా
ట। తమ్ముఁ బోషించు శ్రీదామోదరునకైన నందఱు భూషింతురన్నమాట।
విలయాదిపతయైన విశ్వనాధునకైన నందఱుబూషింతురన్నమాట।
దేవలోకంబేలు దేవేంద్రునకునైన నందఱుభూషింతురన్నమాట। తే॥ గీ॥
కల్ల నేననవెంతటి బల్లిదుండ। నెల్లవారెట్టులనుకున్న వల్లెయనుచు। నుల్లసి
లుచుందు మనమునఁ దల్లడిలక ॥ కలి ॥ ౯౯ ॥

సీ॥ శ్రీసుధాకరవంశ శీతమయూఖుండు శ్రీపూషపాటి దక్షిణకవాట।

ధుగరాజ బిరుదాంకితుఁడుఁ బాచిపేఁటను ప్రాచీపురీ రాజ్యపాలకుండు ।
వగుత్యాడ శ్రీయన్నమానవనీపతికిఁ గంగాంబా మహాదేవి కగ్రసుతుఁడు ।
విజ్ఞాన జనకుఁడస్విఖ్యాతిఁ గాంచిన శ్రీపెద్దమల్లపక్షితివరాధి ॥ తే॥ గీ॥ పతి
సహోదరుఁడను వీరపదరణీవ । రాభిధానుఁడ శ్రీ మల్లికార్జునపద ।
భక్తుఁడనెఱింగిప్రోవుమవ్యక్త కరుణ ॥ కలి ॥ ౧౦౦ ॥

సీ॥ ఘనతరశాలివాహన శకంబునఁదిగతిగదచ్చినొండుసంఖ్యగవిరో
ధి । కృద్ద్వగమార్గశీర్షద్విపక్షతృతీయభృగువాసరముసమముగను వెలయు ।
హూణశకంబునందొఁడొండుఁదొమ్మి దొకటసంఖ్యను ధరిత్రిఁగ్రాలుచు
న్న । సంవత్సరమున డిశంబరు నెల నెన్మిదవరోజు రాత్రికినవపురమున ।
॥ తే ॥ గీ ॥ పూర్తి జేసితినీకృతిపూర్ణకరుణ । నార్తిఁదొలఁగింపుమోశలి
మూర్తి నీదు । కీర్తి వెలయంగ నీమనస్ఫూర్తిగాను ॥ కలిమహారాజ దుష్ట
సంక్రమితతేజ ॥ ౧౦౧ ॥

సంపూర్ణం.

స్వస్తి.

SRI

# Mahadeva Satakam.

BY

## DEVAGUPTAPU RAMABHADRAKAVI.

*Published by*

**Messrs. VONTEDDU LATCHIAH & Sons.**

*General Merchants, Amalapur.*

FIRST EDITION, 1000 COPIES

COCANADA.

PRINTED BY MESSRS G. VENKANNA BROS. AT THE MANORANJANI PRESS.

1912

Price Re. 0—1—0

శ్రీ

# శ్రీమహాదేవశతకము

దేవగుప్తాపు రామభద్రకవి విరచితము.

ఇది

ప్రస్తుతం అమలాపురం వాస్తవ్యులు వీరశైవ బ్రహ్మశ్రీ

బండారు తమ్మయ్యగారిచే సరిచూడబడి

అమలాపురం కాపురస్థులు పగశివానంద మెస్సర్సు

పంటెద్దు లక్ష్మయ్య అండు సన్సువారిచే

---

కాకినాడ:

జి. వెంకన్న బ్రదర్సువారి మనోరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రచురింపఁబడియె.

మొదటి కూర్పు 1000.

1912.

వెల రు 0—1—0

# పీఠిక

ఆంధ్ర భాషాభిమానులార!

సామాన్య జనంబు లందఱికిని సులభశైలిని నీతిని బోధించు నవగుటంజేసి శతకములు మన యాంధ్రగ్రంథములలోఁ బ్రధానములుగ నెన్నఁదగి యున్నవి. రామాయణాది మహాకావ్యములును భాగవతాది పురాణములును, వసుచరిత్ర లోనుగాగల ప్రబంధములును గూడ సత్యోపదేశకములయ్యును గఠినశైలిని భావగర్భితములుగ వ్రాయఁబడిన పెద్దగ్రంథములగు కతన నవిపండితజనంబులకు మాత్రముపకరనార్హమై జనసామాన్యమున కంత మేలొనగూర్పఁ జాలవు. 'శతకము' లన్ననో యానీతులనే కొన్ని పద్యశతములలోఁ బొందుపరచి సులభశైలిని వ్రాయబడినవగుటచేఁ బండిత పామర జనంబుల నొక్కరీతిని రంజింపఁజేసి వారికి మేలొనగూర్ప సమర్థంబులగుచున్నవి. మఱియును భగవన్నామ సంకీర్తనంబు లగుటంజేసియుఁ బరంధాముని జిహ్వోలాసంబుల నుద్ఘోషించు నవ్వగుటంజేసియు నీశతకంబులు ముక్తిదాయకంబులు గూడ నగు ననుట కించుకయు సందియముండదు. అట్టిశతకములు భక్తిరస పూరితములై మృదు మధుర భాషారచితములై లోకజ్ఞాన సమన్వితంబులై చదువరుల మనంబుల నుల్లసిల్లంజేసి తత్కర్తల యశశ్చంద్రికల నెల్లయెడల వ్యాపింపఁ జేయుచున్నవి. ఇట్టిగ్రంథములఁ రచించినకవులు పరమ భక్తాగ్రేసరమిన్నలనియు లోకపరిపూర్ణజ్ఞానవిజ్ఞాతలనియు ననన్యశేముషీవిభవసంపన్నులనియు నూహింపక తప్పదు. కాని యిక్కాలములోఁ బైసుగుణంబుల నొప్పుశతకములను జక్కనిశైలిని రచించుక

వులును వారినాదరించు పోషకులును సన్నగిలి నారనుట లోకవిదితమే. శతక కవిత్వమన్నఁ గడుఁజప్పిడియనియుఁ బామర జనరంజకమనియుఁ గూడఁగొందఱి మతమైయున్నది. మోటు శృంగారపద్యములతో నిండి యుండు కల్లబొల్లిగ్రంథములును యిచ్చవచ్చినరీతిని యేగ్రామ్యభాషనో రచింపఁబడు నవలలును యిక్కాలపు జనసామాన్యమును యాకర్షించుచున్న సంగతి వేరుగ వ్రాయవలయునా? కామినీమణుల కచకుచవర్ణనంబులయందును విరహవేదనలయందును దవుల్కొన్న వారిమనంబులభక్తివైరాగ్యనీతిప్రధానంబులగు శతకములు రంజింపనేర్చునే? కాని పూజ్యులగు మనపెద్దలిప్పటికిని శతకములయం దత్యాదరణనుంచి తాము జిన్నతనంబునఁ బఠించిన శతకములలోనిపద్యముల నప్పుడప్పుడుతమతీరిక వేళలఁబఠించుచుండుటఁ జూచుచునే యున్నవారము.

ఈ 'మహాదేవశతకము' నురచించిన మహనీయుఁడు దేవగుప్తాపులింగకవిగారి పౌత్రుఁడును భాస్కరమంత్రిగారి తనయుండును యగు రామభద్రకవిగారై నట్లీయనశతకాంతమున వ్రాసినపద్యమునుబట్టి స్పష్టపడుచున్నది. వీరుఅమలాపురమునకు నాగ్నేయభాగమున సుమారెనిమిదిమైళ్ళదూరముననున్న దేవగుప్తంగ్రామమందు సుమారొక నూరుసంవత్సరములక్రిందట నివసించిన నియోగబ్రాహ్మణులయినట్లు తెలియవచ్చెడిని. వీరిశతక కవిత్వము భక్తివైరాగ్యరసభూయిష్ఠమై చక్కని శార్దూలమత్తేభవృత్తములతోఁ దనరారుచున్నది. కొన్నిపద్యములు శ్రీధూర్జటిమహాకవికృత శ్రీకాళహస్తీశ్వర శతకమందలిపద్యములనుబోలి వానిని స్మరణకుఁదెచ్చుచున్నవి. కవిత్వమం దచ్చటచ్చట, కొన్నికర్కశరీతి ప్రయోగములును ఛందోభంగములును యుండిననుండవచ్చు. కాని పద్యములన్నియు భక్తివైరాగ్యరసగర్భితములై సర్వేశ్వ

రుండగు మహాదేవుని చిద్విలాస వర్ణనాపరంబులై శివభక్తుల కమి
తానందప్రదంబులై విలసిల్లుచున్న వనుట కిసుమంతయు సందియముం
డదు. ఇట్టి గ్రంథమింతవఱకును ముద్రింపఁబడక తాళపత్రశయ్యాలం
బడియు నచ్చటచ్చట కాగితపుఁబ్రతుల వ్రాయబడియు శిథిలంబగు
చుండుట శోచనీయము. ఈలోపమును నివారణచేయఁబూని యీపట్టణ
వాస్తవ్యులు పరశివానంద వంకిష్టులత్సయ్యగారొక ప్రాతప్రతిని దీసుకు
నివచ్చి నన్ను సవరింపఁగోరఁగా నాకార్యతొందరలచేఁ జాలకాలవిలం
బము జరిగిన నాకోపినమట్టుకు తప్పులసవరించి యిచ్చితిని. వీరలంతొం
దరయే లేకున్న గ్రంథమింతత్వరలో ముద్రణాయంత్రమునకుఁ జేరక నే
యుండును. ఇట్టి జీర్ణగ్రంథముల పునరుద్ధరించుటయందు వీరికుండుకు
న్న భక్తిశ్రద్ధలు కడుంగడు స్తవనీయములు. సద్భక్తయాతీర్ణహారుండ
గు హరుండువీరి కాయురారోగ్యాభివృద్ధులఁ బ్రసాదించుగాత! గ్రంథ
మునవిప్పటికిని వెయియునన్ని తప్పులుండియేయుండవచ్చును. కాఁబట్టి
పండితోత్తములు దయయుంచి తప్పులఁదెలియఁబరచినచో ముందుకూ
ర్పులోనయినను సవరణకవకాశము కాఁగలదు. పాలంగోరికీలాలము
నుజ్జగించుమరాళంబు బలెఁబండితులీ శతకమందలి యొప్పుల నేగ్రహిం
పఁ బ్రార్థితులు.

అనులాపురము

ఇట్లువిన్నవించు,
సుధీజనవిధేయుఁడు,
బండారు తమ్మయ్య.

శివాయనమః.

# శ్రీమహాదేవశతకము

శ్రీమంతుండగు వాసుదేవుఁడు సుర ♦ జ్యేష్ఠుండు శక్రేంద్రుఁడున్
సోమాదిత్యులు సర్వదిక్పతులు లోగిన్ ♦ జొట్టులు పక్షులు నా
నామర్త్యుల్ గనలేని నీమహిమ లె ♦ న్నన్ దుష్కరంబైన మ
త్ప్రేమాసాహసికంబుఁ జూడుము మహా ♦ దేవా! భవానీధవా.

శా. దుగ్ధాంభోనిధికన్యకా పరివృఢ ♦ స్తోత్రార్హ చారిత్ర సు
స్నిగ్ధ స్వచ్ఛ వళక్షగాత్ర దివిష ♦ త్సీమంతి సీమంతినీ
సద్యఃపాత్రివృత వస్త్రకల్పనకళా ♦ సంపాద్య సంభావనా
దృగ్దేవాంగ మునీంద్ర పోషక మహా ♦ దేవా! భవానీధవా. 2

శా. తారా హార పటీర హీర శరద ♦ బ్దస్వర్గవీదేవతా
హ్మారుద్గోశతపంక్తి మద్ధయబుభు ♦ స్తంబేరమైందాద్రియుధ
క్షీరోదన్వదజద్వితీయ్యల నధి ♦ క్షేపించు నీదహాకాం
తే రంజిల్లు జగత్రయంబున మహా ♦ దేవా భవానీధవా. 3

శా. నీవే దిక్కని నమ్మినందుకు జగ ♦ న్నేతా దయాళుండవై
నావిజ్ఞాపన మాలకించి యిఁకనై ♦ నన్ ముద్దు చెల్లించి నీ
సేవాసక్త మనంబునందుఁ గలుగన్ ♦ జింతింపవయ్యా నమ
ద్దేవాధీశ్వర నీకు మ్రొక్కెద మహా ♦ దేవా భవానీధవా. 4

శ్రీ మహాదేవశతకము.

శా. చెప్పంగారాని జనంగముండనఁగ నీ ♦ సేవామహత్వంబు క
న్నప్పన్ ధన్యునిఁ జేసినట్టి విధమం ♦ తా జెప్పఁగా వింటి మా
యాప్పా! విప్రుని ముప్పు దప్పులకు నీ ♦ వై సేగిరాకుండఁగాఁ
ద్రిప్పంజాలునె చెప్ప నేటికి మహా ♦ దేవా! భవానీధవా. 5

మ. నిను సేవించినవాఁడు పుల్కసుఁడు గా ♦ నీ బ్రాహ్మణద్రోహి శీ
లనదక్షుం డవనీ కృతఘ్నుఁడు దురా ♦ రంభుండు గానీ సదా
వనజాతప్రభవాద్యమర్త్యులకు మే ♦ ల్వాఁడై తిరం బైన ము
క్తినిధానంబును బొందకుండఁడు మహా ♦ దేవా! భవానీధవా. 6

శా. లేఁడీ రేడు జగంబు లేలుటకు వే ♦ తేరాజు నీకంటె నీ
వాడించే తెరబొమ్మ లబ్జభవ వి ♦ ష్ణ్వాదిత్య వస్వాదులు
న్మేడల్ మీకు కులాద్రు లీభువనముల్ ♦ మీపల్లె లౌరా! భవ
త్క్రీడాదీర్ఘిక లేడువార్ధులు మహా ♦ దేవా! భవానీధవా. 7

మ. కనుఁగోఁజాలరుగాని జన్మమనఁగాఁ ♦ గన్మోసి కన్విచ్చినం
తనె యీచర్విత చర్వణంబులకు నా ♦ నందించుచున్ మానవుల్
కనకాగార కళత్ర పుత్ర శకసం ♦ ఘకారానిర్బంధ దు
ర్దినహానిం బడి మ్రగ్గిపోదురు మహా ♦ దేవా! భవానీధవా. 8

శా. మచ్చేతోగతి నేమి చెప్పెదను సాం ♦ బా! పార్వతీనాథ యీ
వచ్చేవారికిఁ బోవువారికిని దై ♦ వం బొక్కఁడో యిద్దఱో
చచ్చేదీతనువో తనుస్థమగు నా ♦ చైతన్యమో దీననా
దిచ్చో సందియ మేమి చెప్పుదు మహా ♦ దేవా! భవానీధవా. 9

శా. ఆదుర్దా పడనేల నీచరణసే ♦ వాసక్తుఁడై యున్న వా
డేదుర్లోపములం దగుల్కొనక బ్ర ♦ హ్మేంద్రాదు లర్చించు నీ

పాదద్వంద్వముచేతఁ ద్రొక్కఁబడు రా ♦ ప్యగ్రోవమందుండుధా
త్రిదివోత్తముఁడై తిరంబుగ మహా ♦ దేవా భవానీధవా. 10

మ. రజతక్ష్మాధరగేహసర్వసుమనో ♦ రాజన్ముఖాంభోరుహ
వ్రజసమ్మోదకహాస్తవాహావిజయ ♦ వ్యాలోలఖేలన్మహా
గజచర్మావృత దివ్యదేహ నిజభ ♦ క్తప్రాణి సందోహభృ
త్రిజగత్పాలనకార్యసంగ్రహ మహా ♦ దేవా భవానీధవా. 11

శా. వారిస్వైరిని సాటిఁ జెప్పుటకు స ♦ ర్వజ్ఞుండ వైనట్టి నీ
వారిందావు సమస్తలోకములలో ♦ నాత్మీయ భాగ్యంబునం
జేరన్ గల్గును నీసమీపమునకుం ♦ జిత్తానుసారంబుగా
ధీరాగ్రేసర నన్నుఁ బ్రోవుము మహా ♦ దేవా! భవానీధవా. 12

శా. తే లగ్నింబడిపోవ వెల్వలకు రాఁ ♦ దీయంగనుంబోవఁగాఁ
గేలంటం బొడకున్నె పాలసునకున్ ♦ గీడైనఁ దప్పింపఁ ద
జ్జాలిం బ్రోచిన వానిచేటునకె ను ♦ త్సాహించు నైజంబు లం
దేలాగల్గును తారుమారులు మహా ♦ దేవా! భవానీధవా. 13

మ. తనువచ్చేటవు డించుకేనియును జే ♦ తంగొంచు రాలేదు ప్రా
క్తనజన్మంబునఁ జేసికొన్నదిగదా ♦ కల్గించె నన్నింటి వ
చ్చినరీతిన్ జనుఁగాకఁ దా నొకనికి ♦ చ్చిందేసుమీ జన్మమి
త్తిన కార్యానకు సార్థకంబగు మహా ♦ దేవా భవానీధవా. 14

మ. ఉదరంబా భవదాహ్వాయ న్రివితపి ♦ య్యూమవప్రిపూరంబు నా
హృదయంబాభవదర్ధ నిర్మిత సదా ♦ చారపరిచారంబు మ
త్పదసంబా భవదీయమూర్తి కలదా ♦ సందీప్తమానంబహో
త్రిదశాగ్రేసర నీదెభారము మహా ♦ దేవా భవానీధవా. 15

మ. అజాండచ్ఛే పరిమాణ వత్సరములం ♦ దద్ధంబు నిద్రారతిన్
విజయంజేయును బాల్యయౌవన జరా ♦ విఖ్యాతనానావిధా
గ్రిజమున్ దక్షిణపాలు పద్గతికిఁజే ♦ రేసాధనంబెట్లగున్
త్రిజగత్పావన నీవె చెప్పుము మహా ♦ దేవా భవానీధవా. 16

మ. కనువెట్టంబడి కాలెమన్మథుఁడు నీ ♦ కాండంబుచే మూఁడు ప
ట్టణముల్ గూలెను నీత్రిశూలహతిచే ♦ నారయ్యోనామిత్రసా
ధనవైకల్యము లేదు నీకయితె నా ♦ దౌర్భాగ్యమా నన్నుఁజెం
దినపాపంబు హరింపవైతివి మహా ♦ దేవా భవానీధవా. 17

శా. ఈలోకంబున రాచవాని తలకా ♦ యేశదు మర్యాద లిం
కేలాగుండును వర్ణసంకరముల ♦ య్యేదానికిన్ ముందుగా
మాలుండుం ద్విజుఁడుం సమంబనెదు దు ♦ ర్మానాగ్రణుల్ పెద్దలై
తేలోకానకు సౌఖ్యమెట్లగు మహా ♦ దేవా భవానీధవా. 18

మ. అతిదుఃఖాన్విత మాజవంజవదురం ♦ తాయాస ఖిన్నంబు న
ద్గతి దూరంబు పునః పునర్జననశో ♦ కాపాదనంబైన యీ
బ్రతుకే రోఁత భవత్ప్రసాదమును సం ♦ పాదించి మోక్షార్థియై
ధృతిచేనున్న త్రికాలవేదికి మహా ♦ దేవా భవానీధవా. 19

మ. అనురక్తిం దగురాజునింగొలచి రీ ♦ త్యాకల్పమున్ గోరు మం
దుని బంధంబున పంతసింపఁడు వృథా ♦ స్తూలంబహోరాత్రముల్
నినుసేవించు మహాత్ముఁడై హితసుఖా ♦ లింగోరు యత్నంబుకై
దినకృచ్చంద్రకృశానులోచన మహా ♦ దేవా భవానీధవా. 20

మ. అధికారాంధతమో నిమగ్నుఁడగువాఁ ♦ డైశ్వర్యగర్వంబునం
మదిశంకింపక పిన్నపెద్దలను స ♦ న్మానావమానంబులం

బొదలం జేయుచుఁ దద్గృహాంతమునదె ♦ ప్పళ్ళంబడున్ జచ్చినన్
ద్రిదివద్వారము సేరనీయరు మహా ♦ దేవా భవానీధవా. 21

శా. చేతంజేసితి బుద్ధిపూర్వకముగాఁ ♦ జేయించితిన్ గొన్ని ని
ర్భీతింగొన్ని పరాకునంజరిగెఁ జె ♦ ప్పేటందుకుం శక్యమా
నాతప్పుల్ వృజనాను రూపకముల ♦ న్ననన్నుండ్రియీవర్ణనా
తీతపాత్రభవ మెట్లుబ్రోచెదో మహా ♦ దేవాభవానీధవా. 22

శా. మేనన్మూత్రపురీషదూషితము కే ♦ మీరోయకేతాఁది నే
దైనన్ మానుకుపెట్టి పెంచుకొనుమా ♦ తన్లాఁచిగా సంతకున్
దానేకర్తగ నేను భార్యనని మ ♦ ధ్యన్వచ్చి సాధించు నిం
తేనా దవరవారి ధర్మము మహా ♦ దేవాభవానీధవా. 23

శా. నీవై తే పదునాల్గు లోకములకున్ ♦ నిర్మేతవై తేసరా
బావింజేరినవానిచేతఁ గలదా ♦ ప్పందొప్పిదేగాని పై
గా వారింగొని రాఁదరంబగునె తాఁ ♦ గర్మంబు భావింపఁగా
నేవ్రాయయ్యవె యెంతపాల్లిన మహా ♦ దేవాభవానీధవా. 24

శా. లాలామూత్రపురీషసంకులము కే ♦ లాల ప్రపూరంబు పై
తోలేమేర్వడిగాని లోనరయ కిం ♦ తో రోఁత యీమేనికై
యాలోచించిన నేదిజూచిన నన ♦ హ్యంబిందు నీదేహమం
దేలామోహము నిర్వికారివె మహా ♦ దేవా భవానీధవా. 25

మ. పరదారారతియుం బరస్వహరణో ♦ పాయంబుఁ జింతించుచున్
బరనిందాచరణంబు సేయుచు సురా ♦ పబ్రహ్మహత్యాదిదు
ర్భరకృత్యంబుల సల్పుచుం భవదభి ♦ ప్రాయప్రదీపంబుగాఁ
దిరిగేదుర్జను లెందుఁ జొత్తురో మహా ♦ దేవా భవానీధవా. 26

మ. ఒకనాఁడేనియు ధార్మికప్రకృతిలే • కుండక్క దురాసక్తిఁ జే
తికిరాఁబడ్డ ధనంబు వడ్డికిడి యా • తేడా భుజించే కుసీ
దికుఁడే దారిని బోవునో తెలియలే • దావార్త తానాప్రస
క్తికిఁ బోనొల్లనివాఁడె ధన్యుఁడు మహా • దేవా భవానీధవా. 27

శా. శైవాచార ధురీణుఁడుం శివదీక్షా • జ్ఞానసంప్రదాయజ్ఞుఁడుం
దేవబ్రాహ్మణ పక్షపాతియగువాఁ • డేగాక దైవంబు వే
రేవానించిన రాతిపైఁ బ్రతిమ లే • రీతిన్విచారించినన్
దేవేంద్రార్చిత పాదపంకజ మహా • దేవా భవానీధవా. 28

మ. ధనధాన్యంబులతోఁ దురంగమగజం • ద్రశ్రేణితో రంభతో
నెనయా కాంతలతో నిరంతరము ల • క్ష్మియుంటెనో హాయటం
చును మార్పల్కుచునుండు నెవ్వనిగృహ • స్తోమంబు నప్పుణ్యుఁడా
దిసి మీభక్తునిఁగాఁ దలంచెద మహా • దేవా భవానీధవా. 29

మ. సిరితోఁబుట్టువు వార్యకుంబతివి యా • చింతామణీదేవతా
సురభీకల్పతరుత్కరంబులకు ద • త్తుండైన దేవేంద్రుపై
దొర పీరేడు జగంబు లేలుటకు నీ • తోపాటు బిచ్చాని కే
తికగంజేసితి వేమి చెప్పదు మహా • దేవా భవానీధవా. 30

మ. గరమాహారము తోలు బట్టనగలా • కాలాహిలోలామహే
శ్వరి కాత్యాయని రౌద్రివర్తనమునీ • చందంబు నొంటెద్దుదా
సరి వేమిచ్చెద పీవునిన్నడిగితే • చాలించు కైలాసమం
దిర నీబింకములింక నాకడ మహా • దేవా భవానీధవా. 31

మ. అనుమానింపకు నన్నుఁబ్రోచుటకు నీ • వైతే సదాభక్తర
క్షణ తాత్పర్యము గల్గువాఁడవె మన • స్సందేహ మేమున్నదో

వినియుండీ వినకుండినట్లుగను స ♦ న్వీక్షించి నీసెత్తి మొ
త్తిన యప్పార్థునికంటె లాతినె? మహా ♦ దేవా భవానీధవా. 32

మ. భువిసావాసము చేత నైజగుణముల్ ♦ బోనేర్చునే కాకితోఁ
గవగానుండియు మేఁతమేసి యొకప ♦ క్కంబడి నానాఁటికి౯
దినసంబుల్ పయిఁబడ్డచోఁ బికము జా ♦ తివ్యక్తిలో కాకప
త్రవికారం బొక్కటైనఁ జెందునె మహా ♦ దేవా భవానీధవా. 33

మ. హరి మేర్వంబుధి వేద పుష్పవరలా ♦ హార్యాత్మ్యసంభూతులుం
శరబాణాసన తూణసైంధవలస ♦ చ్ఛక్రోత్తమ స్యందముల్
స్ఫురదాభీల నియంతలై వెలయుచో ♦ ప్పంజేసి యారూఢిఁద
త్త్రిపురంబుల్ పొడిగాదహించిన మహా ♦ దేవా భవానీధవా. 34

శా. భూతప్రీతి పరోపకారపరుఁడై ♦ భూతిత్రిపుండ్రాంకిత
ఖ్యాతుండై నిజకంఠ లగ్నవర రు ♦ ద్రాక్షోపమాలావ్రజో
పేతుండై నినుఁగొల్వలేక బహులం ♦ బీడించి యీపొట్టకై
తేతెమ్మంచును వేఁడు వెంగలి మహా ♦ దేవా భవానీధవా. 35

శా. దేవబ్రాహ్మణరక్షఁ జేయఁటకుధా ♦ త్రీభారముం బూని ధ
ర్మావిష్కారము నిర్వహించుటకురా ♦ జై నిల్చు దైవంబనం
నావిష్ణుః పృథివీపతీ యనెను త ♦ న్న్యాయోక్తి తథ్యంబుగా
దేవప్రాయము రాజశబ్దము మహా ♦ దేవా భవానీధవా. 36

శా. కళ్యాణాచల చాపభూరిభుజగ ♦ గ్రైవేయకోద్వీపసా
కల్యాయుర్ధన ధాన్య నిర్వపణ దీ ♦ క్షాటోపకాపాలికా
మాల్యాలంకృత దివ్యరూప సకలో ♦ న్మత్తారి సంతాప శాం
డిల్యాదిద్విజ మస్కరిందరిను మహా ♦ దేవా భవానీధవా. 37

శా. హస్తాలంబకపాలమాల నిజ భ ♦ క్తామోదవాగ్జాల ని
త్యస్తేభూత నిశాటపాల వృజనో ♦ ర్వీజాతకుద్దాలమి
త్రస్తోమావనపుణ్యశీల గుహచం ♦ ద్రాదిత్యగోపాలకా
దిస్తోత్రవ్యగుణప్రవర్ధన మహా ♦ దేవా భవానీధవా. 38

మ. హిమవత్పర్వతపుత్రికా రమణ ని ♦ న్నేలాగు మెప్పింతు నా
శ్రమ నేనాఁటికిఁ దీర్తువీవు గడియో ♦ జామో నెలో యేడో ని
క్కముగ జీవితకాలముం దెలియ శ ♦ క్యంబౌనె మాబోంట్లకున్
స్థిమితం బెట్లు ఘటింపఁ జేసెదొ మహా ♦ దేవా భవానీధవా. 39

మ. హిమవత్పర్వత పుత్రికారమణ బ్ర ♦ హ్మేంద్రాది బర్హిర్ముఖో
త్తమ సంప్రార్థితపాదచంక్రమణ వే ♦ దార్థప్రతిష్ఠాపనా
సుమహాత్కార్య ధురీణ ధైర్యగుణయు ♦ స్తోక ప్రభావాంఛితా
త్రిమతోద్ధారణ కృత్యకారణ మహా ♦ దేవా భవానీధవా. 40

మ. వనటద్దివ్య తరంగిణీ కలిత స ♦ ద్గాంగేయపంకేజ వా
సనలం జెందిన తేఁటిజేరునె వశ ♦ ష్యత్క్రార ఖర్జూర భూ
జనిసూనావృత పూతిగంధమునకున్ ♦ సర్వేశ! నీప్రాఁపుఁ జెం
దినవాఁ డన్యులపొందుఁ గోరునె మహా ♦ దేవా భవానీధవా. 41

మ. అజవిష్ణుః ప్రముఖామర ప్రభుముఖా ♦ బ్జాదిత్యదేహంభవ
ర్ద్రిజితాదిత్య కపర్దమండల నట ♦ ద్గంగాసముత్తుంగ భం
గజితానంగ భుజంగ భూషణజగ ♦ త్కళ్యాణ సంపత్కరా
ద్విజరాజైకకృసిందుకంధర మహా ♦ దేవా భవానీధవా. 42

శా. కట్టంబుట్టిన వహ్నికాల్చు మఱి త ♦ త్కాష్ఠంబు నన్నట్లుగాఁ
జెట్టిం జీమలు పట్టుకొన్నపగిదిం ♦ జీకాకుఁ గావించుచున్

మొఱ్ఱోపాపమ వద్దు పొమ్మనిన నే ♦ మోకాని పోఁజాలదీ
తెఱ్ఱివ్వంవద లేదిలేదని మహా ♦ దేవా భవానీధవా. 43

శా. ప్రాణంబన్నది గాలిలోమసలని ♦ ర్బంధంబుగా నున్నచోఁ
బో నుద్యోగముఁ జేయుఁగాని నిలచే ♦ పొటంబులే దెప్పుడో
తా నేదారినిఁ బోవునో తెలియఁబోఁ ♦ దాపాటిమాత్రానకై
తేనీమాయ గ్రహింపనీయవు మహా ♦ దేవా భవానీధవా. 44

మ. మితభాషారతుఁ డప్రయోజకుఁడుగా ♦ మేల్వావదూకుండు వి
స్మితుఁడుం డాంబికుఁ డంహతిప్రతి బడా ♦ యీకోరుగానార్యునిం
దితుఁడుం గుత్సితుఁడుం గృతఘ్నుఁడగు వాఁ ♦ డే గట్టివాఁడు న్మహా
ధృతిమంతుండని యెంతు రజ్ఞులు మహా ♦ దేవా భవానీధవా. 45

మ. ప్రణవోచ్చారణముల్ లలాటమునఁ ది ♦ ర్యక్పుండ్రముల్ గంధరం
బున రుద్రాక్షుల పేరులుం దనువునం ♦ భూత్యంగరాగంబుచే
తను శుద్ధస్ఫటికాక్షమాలికయు సం ♦ దర్భించి నీదివ్యమూ
ర్తిని సేవించినవాఁడె ధన్యుఁడు మహా ♦ దేవా భవానీధవా. 46

మ. మొకమానందకరంబుఁగా శ్రవణమున్ ♦ ప్రమోయించియాపాదమ
స్తకపర్యంతము భూతిలేపనము క్షాం ♦ చశ్చర్యమాయించి పా
యక రుద్రాక్షసుమాలిక ల్మెడను డా ♦ యంజేయు నప్పుణ్యమూ
ర్తికిఁ గీడేటికి సంభవించును మహా ♦ దేవా భవానీధవా. 47

మ. శివభక్తుం డగువాఁడె దైవమనుచుం ♦ జింతించి లింగార్చనా
ప్రవణుండై భసితాంగరాగుఁ డగుచున్ ♦ భస్మత్రిపుండ్రాంకిత
చ్ఛవి ఫాలంబున నావరింపఁగ తదా ♦ చారపరిభావజ్ఞుఁడై
దివసంబుల్ కడకొత్తు విజ్ఞుఁడు మహా ♦ దేవా భవానీధవా. 48

శా. సామీప్యంబు పిశాచసంకులము నీ ♦ సారూప్య మర్ధాంగికా
వ్యామోహంబు శ్మశానవాటికయె నీ ♦ వాసంబు సాలోక్యమం
దామోదింపదు నామనంబు భవదీ ♦ యంబైన సాయుజ్యమం
దేమో మక్కువ నాటియున్నది మహా ♦ దేవా భవానీధవా. 49

శా. ఏమీతోఁచదు ముందుసాధనము నా ♦ కీతుచ్ఛ సాంసారిక
వ్యామోహంబునఁ బోయెఁ గాలము వృథా ♦ యాసంబుగా నింకన
న్నేమార్గానఁ దరింపఁజేసెదవొ ముం ♦ దేచూడుమా సాంబమూ
ర్తీ మృత్యుంజయ దీనపోషక మహా ♦ దేవా భవానీధవా. 50

మ. తనుసంజాతులటంచుఁ బేర్కొనుట కం ♦ తాపుత్త్రులేతండ్రి జీ
వన మున్నప్పుడు తప్పి త్రిమ్మరక జీ ♦ వాంతంబునం దాబ్దికా
గ్నినిమిత్తంబులు సల్పుచు న్వడి గయా ♦ తీరంబునం న్పిండంబ
త్తి నిబిండంబిడువాఁడె పుత్త్రుఁడు మహా ♦ దేవా భవానీధవా. 51

మ. తలపోయేపనికైన లోఁబడుట కం ♦ తా ఘోరసంసారవాం
ఛలకుం జిక్కుటకే వృథాకథన మే ♦ చందంబునం జూచినం
గలచందంబుగదా ప్రపంచ మనఁగాఁ ♦ గాసింతయేనిన్మదిన్
దెలియంజాలరు దీని మర్మము మహా ♦ దేవా భవానీధవా. 52

మ. బలవద్వైరుల లోనఁ బెట్టుకొని పై ♦ పైవారిచే నాపదల్
గలిగె న్నాకని కుందువారిఁ జెనటుల్ ♦ గానెంతు నిష్కాములై
మెలమిన్ లోపలిశత్రులం దునిమి తే ♦ యేర్పాటుగా నందఱుం
దెలియ న్మిత్రులె శత్రులెవ్వరు మహా ♦ దేవా భవానీధవా. 53

మ. కలికాలంబును లోఁదలంచుకొని స ♦ త్కార్యంబుచేఁ దామసం
గలిగెం దత్ఫల మూరకొన్నఁ ద్రిజగ ♦ త్కళ్యాణిచేఁజేతలం

గలయంజేసినఁ గాని జెంద వశములే ♦ కాలజ్ఞులై చెప్పినం
దెలియంజాలరు సూక్ష్మమార్గము మహా ♦ దేవా భవానీధవా. 54

శా. అష్టావింశతి కాగమంబులు పురా ♦ ణాష్టాదశగ్రంథముల్
త్వష్టావక్త్రి సముద్భవంబులగు వే ♦ దంబుల్ తదంగంబులుం
దూష్టీభావము గాని వాస్తవముగా ♦ స్తోత్రింబుఁ జేఁజాలునే
త్రిష్టున్మాత్రతుఁడ నాకుశక్యమె మహా ♦ దేవా భవానీధవా. 55

మ. మలమూత్రింబుల పుట్ట పోట్ట యసకృ ♦ న్మాంసాస్థిచర్మాస్రసం
కుల మీమేనుయను ప్రపంచమునకున్ ♦ గోపంబు.మోసంబదే
వలనంజూచిన దీనిపొందు విడిపో ♦ వంజాల దెంతైన బం
దెలకీబొందియ కాదె మూలము మహా ♦ దేవా భవానీధవా. 56

శా. అజ్ఞానాంధతమఃపతంగ నిజహ ♦ స్తాలీఢ సారంగ సూ
ర్యాజ్ఞాది గ్రహరాజరక్షణ శర ♦ వ్యాసంగ దివ్యాంగ స
ర్వజ్ఞపోక్త మతత్రిభంగ ఖరదృ ♦ గ్భస్మీకృతానంగ హా
సిజ్ఞానాప్రబలోపద్దళిక మహా ♦ దేవా భవానీధవా. 57

శా. పుట్టింపం బ్రతికింపఁ దుంప నగునే ♦ ర్పుంబూని విన్నాణివై
మెట్టం బట్టము గట్టుకొన్నదొరవే ♦ మీపాటివారేరి మీ
పొట్టం బుట్టిన లోకసంతతులకుం ♦ బోరాని చుట్టానవై
తెట్టుం బ్రోవక నీకుఁదప్పదు మహా ♦ దేవా భవానీధవా. 58

మ. గడిసర్పంబును దంతువాయువు మతం ♦ గ శ్రేష్ఠముం బచ్చునా
యుడునీభక్తులకెల్లనుంగుఱుతుగా ♦ ఢో వారీష్ఫూర్వోత్తరం
బడిగేవారికిఁ జెప్పరాద శివసే ♦ వాభక్తులై నైజమా

జడతం బాసి నిజస్వరూపములతో ♦ సాయుజ్యముం బొందుటఁ
దెలియంజాలరు మాదృశుల్ హరమహా ♦ దేవా భవా నీధవా. 59

మ. కరి యేమంత్రము దాపఠించె ఫణియే ♦ కాలజ్ఞతం లింగస
త్కారనాభ్యర్చన మాచరించె ధృతిచే ♦ తన్ లూత నీమంబునే
గురుశిక్షాపరతం గ్రహించె నివి పె ♦ క్కుల్ చెప్పఁగానేల సు
స్థిరమౌ భక్తియె నీకుముఖ్యము మహా ♦ దేవా భవానీధవా. 60

మ. గణసేవారత మర్పణవ్రతము ష ♦ ట్కాలస్వలింగార్చనా
గుణసంపాదన లింగధారణము నా ♦ కుంజూడ కాకుత్స్నమౌ
ఫణి మేల్కొల్పిన చందమౌను విధిలో ♦ పంబైనచో మూఢభ
క్తిని సేవించుట ముఖ్యకార్యము మహా ♦ దేవా భవానీధవా. 61

మ. పలుచందంబుల సంచరించితి మనః ♦ ప్పాటశ్చరుం డెన్నిగం
తలు దూరించిన దూరితిన్ తనువు ని ♦ త్యంబంచు గర్వించి యే
కొలఁకుం బాత్రముగాని కార్యములు పె ♦ క్కుల్ సేసి నీమాయనే
తెలియంజాలక మోసపోతిని మహా ♦ దేవా భవా నీధవా. 62

మ. మతిమంతుల్ గుణవంతు లుత్తములు స ♦ న్మాన్యుల్ శివాభ్యర్చనా
వ్రతసంపూత చరిత్రు లార్యజను లా ♦ రాధ్యుల్ సదారాధ్యులీ
క్షితిపై వారల భక్తిపూర్వకముగా ♦ సేవించువారే యనిం
దితమార్గంబున నిన్నుఁ జొత్తురు మహా ♦ దేవా భవా నీధవా. 63

మ. నినుసేవించి కృతార్థులైన జనుల ♦ న్నిర్వాణ పీఠస్థులం
గని యీసంగతి యెట్టిదో తెలిసికోఁ ♦ గాంక్షింపఁగానేల నా
యనుమానంబుఁ బరిత్యజించుకొన ని ♦ న్నాసించి యున్నాగదా
తినబోతూ రుచు లెన్న నేటికి మహా ♦ దేవా భవానీధవా. 64

మ. పలుచందంబులనిన్నుఁ గొల్చు నతఁడే ♦ బ్రహ్మణ్యుఁ డార్యుండు ని
ర్మలుఁ డౌ నందుకు సంశయించునతఁడా ♦ బ్రహ్మణ్య సంప్రాప్తి కిం
గలదే నిష్కృతి యెన్నిజన్మములకున్ ♦ గాకున్న సామాన్యమా
తెలియంజాలరు నీమహత్త్వము మహా ♦ దేవా భవానీధవా. 65

మ. ప్రణవోచ్చారణ పూర్వకంబుగ మహా ♦ పంచాక్షరీ మంత్రమే
ఘనుజిహ్వాగ్రమునందు వర్తిలు నిరా ♦ ఘాటంబుగా నమ్మహా
త్ముని పాదోదక సేచనంబునఁ గృతా ♦ ర్థుండౌ జనుం డట్టిభ
క్తినిదానంబగు ముక్తిఁ గాంచెద మహా ♦ దేవా భవానీధవా. 66

శా. ఆలుం బిడ్డలకంటెఁ జుట్టములు లే ♦ రంచు న్మహామోహినై
కాలక్షేపము చేసితిం జనియె నా ♦ కాలంబు నిష్కారణం
బాలోచించిన యీజవంజవదుమా ♦ హానోకహ శ్రేణికిన్
స్త్రీలేమూలక మెల్లవారికి మహా ♦ దేవా భవానీధవా. 67

మ. అడియాసంబడి క్షుద్రదేవతల వె ♦ న్నాడించినన్ వారిట
క్కులకుం జిక్కెనె పాపము ల్వేగచునే ♦ కుందేళ్ళు తాటాకుచ
ప్పుడుచే నల్పునిభార్యకంటెఁ గడుబ ♦ ల్యుండైన వానింట నుం
డెడు నేబానిసయైన మేల్గద మహా ♦ దేవా భవానీధవా. 68

మ. అధికారాంతమునందుఁ గన్పడుఁ దదీ ♦ యాగోవికారంబులుం
విధవైతే గనిపించు ఆంకుబుణముల్ ♦ వీథెక్కినం దోఁచున
య్యధమరణత్వము లేమిలోఁ దెలియు భా ♦ ర్యాభక్తి లోకానకున్
దిద్దివేందార్చిత పాదపంకజ మహా ♦ దేవా భవానీధవా. 69

మ. అడిగేవానికిఁ బ్రాణమొక్కటియె భా ♦ గ్యాధిక్యతన్ మూర్ఖుఁడై
గడిమిన్ లోభ్యుఁడు వెల్తిమాటలఁదిర ♦ స్కారంబు గావించినన్

నడువంజూచును బ్రాణమొక్కటియుఁ ద ♦ న్నాసించు ప్రాణఘ్నతం
దెలుపన్నేరమి హానిఁ జేయును మహా ♦ దేవా భవానీధవా. 70

శా. ప్రాంచత్కాంచన పర్వతేష్వాసనవా ♦ గ్భర్తృప్రభుత్వార్చితో
దంచత్పాదసరోజ దిగ్వసనరా ♦ ప్యత్స్మాధరాదిత్యకా
సంచార ప్రమథాభిసేవిత సము ♦ జ్యానిర్జితాశేష రా
త్రించారావృతనాపరాక్రమ మహా ♦ దేవా భవానీధవా. 71

శా. కాంతాకాంచనములు విధాత ధరపైఁ ♦ గల్పించెఁ దల్లీలచే
నంతా మోహితులౌటకై తెలివిహీ ♦ నంబట్టియయ్యాసకా
నంతైనం జొరనీక నిల్చునతఁడే ♦ సర్వేశుఁ డీయర్థమం
దెంతే నీయెడ లేదు నిక్కము మహా ♦ దేవా భవానీధవా. 72

మ. చనియెం గాలము మూఁడుపాతికలహో సం ♦ సారకూపంబులో
మునుఁగం దేలను గాని యొండెఱుఁగ నా ♦ ముప్పెప్పుడో కప్పకై
యణువున్నట్టి భుజంగమంబుక్రియ డా ♦ యంజూచు నీదేహికై
దినమున్ మృత్యువు పొంచియుండును మహా ♦ దేవా భవానీధవా. 73

శా. క్రవ్యాద వృష దుగ్రటంక నిజభ ♦ క్తత్రాణ నిశ్శంక మూ
ర్ధివ్యాకల్పశశాంక దృగ్దహనచూ ♦ ర్ణీభూత మీనాంక స
త్యవ్యశ్రోత్రి విలంబి భూరిచయ భా ♦ స్వద్రత్న తాటంక త్వ
ద్దేవస్థాన నిజాంక శంకర మహా ♦ దేవా భవానీధవా. 74

శా. దేవబ్రాహ్మణ భక్తిహీనులపవి ♦ త్రీభూత చేతస్కులం
తేవాశి ప్రకృతిప్రచారులు భవ ♦ ద్దివ్యప్రభాహీన వి
జ్ఞావిఖ్యాత జనాపవాదులగు మి ♦ థ్యావాద సంపాదులే
దేవా నీప్రియులంచు మ్రొక్కఁద మహా ♦ దేవా భవానీధవా. 75

మ. విమలామోదకరంబుగా ఘుమఘుమా ♦ విఖ్యాతమౌ యక్షక
ర్దమ లిప్తాంగము సామునిర్మలవిశు ♦ ద్ధస్వచ్ఛ భస్మానులే
పము సామ్యంగము గాఁగ నీయొడలు నే ♦ ర్పాటౌట శాస్త్రప్రవృ
త్తి మృషాగాదను చంద మేర్పడు మహా ♦ దేవా భవానీధవా. 76

మ. వసటంబెట్టకు మింక దీనుఁడను నీ ♦ వాడం దయాశాలివై
మనుపం జూడుము నీకు దప్పదు సుమీ ♦ మావంటి పాపాత్ములం
గనికారంబునఁ బ్రోచువారెవరు నీ ♦ కన్నన్ శివానాథకం
ధినిపాంగాంగజభస్మలేపన మహా ♦ దేవా భవానీధవా. 77

మ. చరమావస్థను బొందినప్పుడు మన ♦ శ్చాపల్యముం దాపముల్
కరపాదప్రముఖప్రదీపములవై ♦ కల్యంబు పీడింప నా
చెఱలో నీచరణాంబుజద్వయ మన ♦ శ్చాపల్యమెట్లుండునో,
తిరమౌన ట్లిపుడే యొనర్చెద మహా ♦ దేవా భవానీధవా. 78

మ. అనుమానింపఁగనేల నీచరణ సే ♦ వాసక్తుఁడై ముక్తిఁ జెం
దని దౌర్భాగ్యుఁడు లేఁడు లోకమున లూ ♦ తాదంతికాలాహివ
క్త్రాణపాసాధిక మూఢజాతులును శం ♦ కాటంకముల్ లేక ము
క్తినిసేవించుట మాకుసాక్ష్యము మహా ♦ దేవా భవానీధవా. 79

శా. ఖాసాల్ పట్టపురాజు లయ్యెదరె పై ♦ కంబెంతయున్నన్ మహా
రాసుల్ బియ్యపు రాసులౌనె ఘాశిపా ♦ రం జల్లినంగాని ది
గ్వ్యాపోన్నైభవ క్షుద్రదేవతలు పె ♦ క్కండ్రైన నీవౌదువే
ధీసామ్రాజ్యధురంధర మహా ♦ దేవా భవానీధవా. 80

మ. చతురస్వీకృత వేదవేవిహానభూ ♦ పాసంభృతామోదసం
స్మిత వక్త్రామృతపాద కోపశిఖిభ ♦ స్మీభూతకన్యాదప

ర్వతరాజాత్మతనూజ నిర్మలమనో ♦ రాజీవ షట్పాద వి
స్తృతరౌప్యాచలపాద సౌఖ్యద మహా ♦ దేవా భవానీధ . 81

మ. దురితోత్తాలలతాలవిత్ర యమృతాం ♦ ధోలోకపాలాదిఖే
చరసంభావనపాత్ర సంతతయశ ♦ స్స్వచ్ఛకాంతిచ్ఛటా
పరిపూర్ణోత్తమ దివ్యగాత్ర కమలా ♦ ప్తస్తోత్ర కైలాసమం
దిరకళ్యాణచరిత్ర శంకర మహా ♦ దేవా భవానీధవా. 82

శా. నీలగ్రీవ భవన్మహామహిమ వ ♦ ర్ణింపంగ నాశక్యమా
నీలోనం సగబాలుఁ బంచుకొన ♦ తా నేరత్ర్యయే యంతకుఁ
గాలక్షేపముఁ జేయుచున్న త్రిజగ ♦ త్కళ్యాణి మూలాగ్రముఁ
దేలం బ్రస్తుతిఁ జేయనేర్తునె మహా ♦ దేవా భవానీధవా. 83

మ. అనుకుంటే యిది నోటితప్పు భవదీ ♦ యంబైన సామర్థ్యముఁ
మనుజుల్ చక్కఁగఁ జెప్పఁగోఁదగరు సా ♦ మాన్యుండవా నీవు నీ
వెనుకం జూచిన వారికందఱికి నీ ♦ వేతండ్రివై యొక్క రీ
తిని బాలింపక యున్కి మంచిదె మహా ♦ దేవా భవానీధవా. 84

మ. ప్రమథాధీశ భవత్పదాంబుజ సప ♦ ర్యాసక్తచిత్తంబునం
బ్రమదంబొప్పఁ బ్రతిక్షణంబు నియతిన్ ♦ బంచాక్షరీమంత్రరా
జ మనుష్ఠానము సేయుచుం దినములీ ♦ చందంబునం బోవనా
త్రిమిమ్ముం జెందినవాఁడె ధన్యుఁడు మహా ♦ దేవా భవానీధవా. 85

శా. నీచేనున్న మృగంబుపైఁ గరుణనా ♦ నేత్రాగ్నికోష్ఠంబునా
డాచే గొడ్డలి మొక్కపోవుననిచూ ♦ డా వారి చేఁజిక్క కా
కాచేవారలు లేక నాయురుచిక్కై ♦ కన్నప్ప నోటంగిలై
తేచింతామణి యట్లు దింటివి మహా ♦ దేవా భవానీధవా. 86

మ. భవదాజ్ఞం శిరసావహించుకొని సా ♦ ఫాలంబు నీకాలికీఁ
దవుల న్మ్రొక్కుచు నాజవంజవసము ♦ ద్రించీద లేనింక న
న్నవలం జేర్పుమటన్న విన్నపము నీ ♦ వాలించి పాలించవై
తివి నాకెవ్వఁడొ దిక్కు చెప్పుము మహా ♦ దేవా భవానీధవా. 87

మ. శరణన్నన్ వినిపించుకోవు మహదై ♦ శ్వర్యాతిరేకంబునం
గురుపేబుట్టెనొ భక్తులందు ననుకం ♦ పాదృష్టి లేదాయెనో
కిరికై పోరుని యుద్ధకాలమున డా ♦ కేలెత్తి మున్నెత్తి న
న్నరుఁడు వ్వోత్తున మొత్తితే చెవుడు దా ♦ నంబుట్టెనో నీకు న
త్తెఱఁగేలాటిదో తోఁచకున్నది మహా ♦ దేవా భవానీధవా. 88

మ. ప్రసవావేదనఁజెంది బిడ్డఁగని యా ♦ బాముల్ నిజస్వాంతమం
దిసుమంతైనను నెంచుకోక మఱియా ♦ యింపే యెదం గోరుగూ
పసిచందంబున మానవుండు మునుపౌ ♦ బాముల్ విచారింపక
ద్దెస యేగోరు నిదేమిచిత్రమొ మహా ♦ దేవా భవానీధవా. 89

మ. శివశంభో పరమేశ విశ్వజనకా ♦ చింత్యప్రభావా హరా
భువనాధీశ్వర కావవేయనుచుమ ♦ ద్బుద్ధీంద్రియప్రాణవా
యువు లేకంబుగఁజేసి నీచరణసా ♦ యుజ్యంబెదంగోరునా
దెసఁగీగంటను జూడవేటికి మహా ♦ దేవా భవానీధవా. 90

శా. సాంబా ! నిన్నుదలంచి వేఁడుకొనిశ ♦ శ్వద్భక్తి నీపాదప
ద్మంబుల్ పూజలొనర్చు భక్తులకు సి ♦ ద్ధంబౌగదా భిక్షువే
షంబుల్ భూతి దిగంబరత్వము విషా ♦ శిత్వంబులిమ్మాటనా
డెంబే యెవ్వనిగొల్తు రట్లగు మహా ♦ దేవా భవానీధవా. 91

మ. భవదీయంబగు రూప మెవ్వడుమదిం ♦ భావించి నీనామమం
త్రివరం బెప్పుడు జిహ్వపై నిలుపునా ♦ తండే జుమీా శకృచ

శ్రీవిరించాదుల కందరాని సుఖవా ♦ ర్థిన్నోలలాడుంసదా
దివిషద్వర్ణిత పాదపంకజ మహా ♦ దేవా భవానీధవా. 92

శా. రాజానుగ్రహ మెట్లొ యల్పునిపయిన్ ♦ రాఁగా నతండే తనే
రాజైనానని పంచమేధ్రునికృపం ♦ రాగాంధుఁడై మంచిచె
డ్డేమాడం డది తప్పినం శవము వాఁ ♦ డేజుమ్ము యీధాత్రిపై
తేజోనిర్జిత పూర్ణిమాశశి మహా ♦ దేవాభవానీధవా. 93

మ. హరశంభోపరమేశ విశ్వజనకా ♦ కాలాహిసంభూషితా
సురసంసేవిత పార్వతీరమణ వి ♦ శ్వద్యక్షులోకేశ శం
కర కారుణ్యపయోధి మారహర స ♦ త్కైలాస సంచార భా
స్కర సోమాగ్ని విశాలలోచన జగ ♦ త్కర్తా ననుంబ్రోవుసు
స్థిరసౌఖ్యంబును నొందఁజేయుము మహా ♦ దేవాభవానీధవా 94

మ. తలిదండ్రుల్ సుతు లన్నదమ్ములును మి ♦ త్రామాత్యవర్గంబు బం
ధులుకోడండ్రును వెంటరాగని సుబు ♦ ద్ధుల్ పెక్కుమార్గంబులం
దెలియంజెప్పిన వారిఁ బోవిడిచి నీ ♦ దిక్కే కనుంగొంచు చిం
తిలి నిన్ గొల్వఁగలేఁడు మూర్ఖుఁడు మహా ♦ దేవాభవానీధవా. 95

మ. ధనమెంతేని గడింపగాఁదలఁచి చి ♦ త్తంబందు నప్పుణ్యాపా
పనిరీక్షాక్రమమెల్లఁ బోవిడిచి దు ♦ ర్భావానువృత్తిన్ సదా
దినముల్ పుచ్చుచుసొమ్ముగూర్చుకొనుచుం ♦ డేమూర్ఖుఁడెప్డోతుదిం
దినకృచ్చంద్ర కృశానులోచన మహా ♦ దేవాభవానీధవా. 96

మ. శరదబ్జప్రతిమానగాత్రవిలస ♦ త్సౌజన్యచారిత్ర భా
స్కరసోమాగ్నివిశాలనేత్ర భవపా ♦ శప్రస్ఫురద్వల్లికా

ఖరనిర్ద్వైకలవిత్రి వహ్నియుదకా ♦ కాశాదిభూతావళీ
స్థిరపట్ప్రత్ప్రదపాత్రినామక మహా ♦ దేవాభవానీధవా. 97

శా. దేవాధీశ మహేశ శంకర గిరీ ♦ శాకాలకాలాభవా
భావాభావవిచారదూర హరశ ♦ ద్వా పార్వతీనాయకా
శైవాంతఃకరణాబ్జబంభర శివా ♦ చంద్రావతంసా నమ
స్తే వామాంకనతీనుతీరుచి మహా ♦ దేవాభవానీధవా. 98

మ. జయసర్వేశ వినమ్రుతావరగుణాం ♦ చత్సౌఖ్యసంపత్ప్రదా
జయమాతంగకుమారికా హృదయరా ♦ జత్పంకజేందిందిరా
జయలక్ష్మీరమణార్చితాంఘ్రియుగళా ♦ భాస్వర్ణనీరేజ సం
దియమింకేటికిఁ బ్రోచి కావఁగమహా ♦ దేవాభవానీధవా. 99

శా. శ్రీమన్మంగళ మార్యసంస్తవనపా ♦ తీర్థభూతపాదద్వయా.
విమలాభాషు నిరస్తలోకనిచయా ♦ విద్యాతభక్తౌఘుదు
స్తిమిరాళీ భవదీయపాదములకున్ ♦ శీతాంశుకోటిద్యుతీ
స్థిమితంబుల్ గలుగంగఁజేయుము మహా ♦ దేవాభవానీధవా. 100

మ. విపులస్వచ్ఛతర ప్రబంధరచనా ♦ విద్యాంసుఁడుండేవగు
ప్తపువంశోద్భవుఁడైన లింగకవికిం ♦ బౌత్రుండచంచత్కవీం
ద్రపుఁడౌ భాస్కరమంత్రిపుత్రుఁడను ♦ పేరంరామభద్రుండనో
ద్విపచర్మాంబరనీకుభక్తుఁడ మహా ♦ దేవాభవానీధవా. 101



| | | | | |
|---|---|---|---|---|
| 12 | 63 | 3 | కొలఁకుల | కొలకుల |
| 12 | 64 | 4 | తినబో | తినఁబో |
| 13 | 69 | 3 | మదగ | మూర్గ |
| 15 | 77 | 1 | వాడం | వాఁడం |
| 16 | 83 | 2 | తా | నే |
| 17 | 87 | 1 | సాఫా | వాఫా |
| 17 | 91 | 2 | డేజూపి | డేఁజూమి |
| 17 | 91 | 3 | శత్వంబు | శస్త్వంబు |
| 18 | 94 | 1 | దశ్వ | కశ్వ |
| 18 | 94 | 2 | సుర | సౌర |
| 18 | 96 | 3 | డెష్టో | డెట్లో |
| 18 | 98 | 1 | దేవా | దైవా |
| 18 | 98 | 2 | శద్వా | శర్వా |
| 19 | 98 | 4 | నతి | సతి |
| 19 | 101 | 4 | ఘస్తుడ | ఘస్తుఁడ |

# ప్రకటన

స్వదేశభాషాభిమానులైన మిత్రులారా!

మేముపురాతనముగా సంస్కృతాంధ్రగ్రంథములను స్కూలుపుస్తకములు స్టేషనరివగైరా సామానులు విక్రయించుచుండినది యెల్లరకు దెల్లంబేగదా!

ఈమధ్య కొంత కాలముగా పుస్తకముల వ్యాపారముమాత్రమునిలుపదలచేసినందున మావద్దవ్యాపారముజేయువర్తకులు, స్నేహితులు, మొదలగువారలు కోరెడుగ్రంథములు నొకేతావునలభించక యితరులకు వ్రాసి తెప్పించుటచే ఖర్చులు అధికమగుటయు లభించినచో ధరలు హెచ్చుగానుంటున్నవనిమామిత్రులలో కొందరుపూర్వమువలనే పుస్తకములనన్ని మఱల తెప్పించి విక్రయించవలయునని కోరినందున ప్రసిద్ధిజెందిన గొప్పముద్రాక్షరశాలలయందు చక్కని యక్షరములతో మంచికాగితములపైని ముద్రించి మేలైన బయిండ్లుచేయబడిన, భారత, భాగవతాది పురాణములు, వైద్య, జ్యోతిష, వేదాంత ధర్మశాస్త్ర, కావ్య, నాటకాలంకార, పద్యకావ్య, వచనగ్రంథములును, వైష్ణవగ్రంథములును పేరువడసిన గ్రంథకర్తలచే వ్రాయంబడి చిత్రకల్పనలతోనిండి ప్రతివారామోదించునట్టి నీతిబోధకములైన (నావల్సు)అనుచిత్రవచనకావ్యములు, నాటకరత్నములు, బాలురుచదువుకొనుస్కూలుపుస్తకములు మొదలగుగ్రంథములు, స్టేషనరిమొదలైన సామానులును, మిగులసరసమైన ధరలకు విక్రయించుచున్నారము.

వి. పి. మార్గము నపేక్షించువారు, అర్ధరూపాయకు తక్కువలేక వ్రాసి తెప్పించుకొనవలయును మావలన నేవిషయమైనను దెలియగోరువారు రిప్లయికార్డుమూలము వ్రాసిప్రత్యుత్తరము తెలుసుకొనవలయును.

ఇట్లు
వంటెద్దు లత్సయ్య & సన్సు,
జనరల్ మర్చెంట్సు, బుక్కుసెల్లర్సు
అమలాపురం.

